III

# ఒకటి, రెండు.

మాటలు గ్రంథమునకు తొలుత సంతరించుట ఆచారము. గ్రంథమునకు పీఠిక వ్రాయుట ఉంత్సోతు ముందు నడచుచుండ అనుసరించు ఉద్యోగి దర్పావంటిది.

ఈనాటికను పతితలు రెండు మారులు చదివి, తదుపరి కావ్యకారుని దూషించిన, శపించిన, కాక భూషించిన అభ్యంతరము లేదు.

గాథ ప్రాచీనమైనను, మెరికలవంటి ఉద్వేగపూరితమైన శిథిల సమకాలిక జీవిత స్రోతసులకు ఇవి ప్రతిబింబ వినా కానేరరు——

ఇందలి ఊహా గానాలాపిత భావశబలత, దుస్సభూయిష్ఠ పరిదర్శనములు, ఉద్రేక జ్వాలామయ ప్రళయములు, కాల వైపరీత్యమున పరికృత లేశని బొందిన ఛటాచ్ఛటలు——



# మేలికొంగు.

ఈచిన్న పొత్తము వ్రాయుటలో చేతోడు వాదోడుగా నిలచిన మిత్రుడు మైనేని రామకోటయ్య సాహాయ్యమునకును, తగను కూలమగు మార్పులు సూచించి, ముద్రిణాకై ప్రోత్సహించిన శ్రీయుత మారిన నర్సన్న, దొడ్డపనేని సీతారామయ్య, వెనిగళ్ల వెంకట్రామయ్యగార్ల ప్రియమధురోక్తులకు నా మేలికొంగును పరచుచున్నాను—

ఓం.

[రాజు మృతిజెందెను. రాణి అంతకు పూర్వమే కైలాస వాసియయ్యె. వారికి ఇరువురు పుత్రులు, పుత్రికాద్వయమును కలరు.

పెద్దవాడైన ప్రేమదత్తుడు స్వీయ సోదరుని రాజ్యము నుండి వెడలగొట్టి, రాజ్య భారమును వహించెను. శత్రురాజుల అండజేరి సైన్యమును చేకూర్చుకొని, అన్నపైకి జన్వంతుడు యుద్ధమునకు కదలెను. జరిగిన ఘోరయుద్ధములో సోదరు లిరువురును మృతి నొందిరి. వారి మేనమామ యగు హేమంతుడు రాజ్యమునకు వచ్చెను.]

—♦ ఈనాటకయందు పాత్రలు ♦—

ప్రేమదత్తుడు,
జన్వంతుడు,
వసంతసేన,
నైళ,
} పూర్వ రాజు సంతానము.

హేమంతుడు- ప్రస్తుతపు రాజు. పూర్వపు రాజుబావమరది

ప్రభాత కుమారుడు - హేమంతుని కుమారుడు

రాగిణీదేవి - హేమంతుని భార్య. ప్రస్తుతపు రాణి.

జయశీలుడు - మంత్రి

పులోమి — శవకాపరి.

# స్వేచ్ఛాజీవులు.



మొదటి రంగము.

[నైళ ఆలోచనతో కూర్చుండి యుండును.]

వసంతసేన (ప్రవేశించి)

నైళా! హా!! సోదరా!!! హృదయ రహితుడు రాజు. రాజ ధర్మము కఠినమైనదా...? కాదు రాజునకు మానవునకుండు సహజదయార్ద్ర హృదయము కలదు. కాని... హేమంతుని యందు శూన్యము. మహారాజునకుపుత్రుడవై, అయ్యో! ఎంతటి భరింపరాని స్థితిని బొందుచుంటివి!!

నైళ. (హృదయావేగముతో)

సోదరీ! ఏమి విపత్తు? మూర్ఛపోవుచుంటివే!! అస్మదీయ సోదరుల గతదుఃఖభూతమైన జీవిత విచ్ఛిత్తి కాక మరి జరిగిన దేమున్నది? వారు రాకుమారులు; రణరంగము వారిభుజస్కంధముల పటిమత ప్రదర్శించు విహార భూమి.

ఇపుడు దుఃఖింప కారణమేమున్నది? లేచి కూర్చుండుము. దుఃఖోప శమనము చేసికొనుము.

వసంతసేన- (జారిన వేణీభరముతో)—

కలహామునకు జస్వంతుడు కారణమట; స్వీయ రాజ్యముపైకి దండెత్తిన రాజద్రోహియట; రాజ్యములో జరిగిన దుఃఖకరమైన క్రాంతికి మూల కందమట-

విధి విలసిత విధానమున అతనికి దహన సంస్కారము జరుగుటకు వలను పడదని రాజు ఆజ్ఞ. ఆశవమును కుక్కలు, నక్కలు, కాలదన్ని, నిజదంష్ట్రములతో విదారముచేసి, తమ పొట్ట బెట్టుకొనవలెనట.

హా...! హా...!!

(నిదానించి) శ్రీమదత్తునకు సలక్షణముగా దహనసంస్కారము జరిగిపోయినది.

(ఆవేగముతో) చెల్లెలా! ఇది విపరీతచర్య భరింపరానిది.

సైళ- (విస్మయముతో)

మహీచక్రమును ఏకపతిగా పాలించగల రాకుమారునకు శ్మశాన వాటికలో చేటెడు నేల—!

ఇది హేమంతునకు ధర్మము కాదు. చచ్చిన వారిపైనా? పగలు! ధర్మబుద్ధిగల ప్రజలయెదుట అధర్మవిధిని స్వజాతిని అవమాన పర్చుచున్నాడు రాజు. హా...! సోదరా...!!

వసంతసేన. (దిట్టతనముతో, నిలబడి)

మన తండ్రి రక్తమింకను భూమిపై సజీవముతో నున్నది. హేమంతునకు హృదయము లేదు. మనము రాకన్నెలము. ఇంకను భారతనారి అధర్మ వ్రతాచరణకాలేదు. మనకు హృదయము లేదా? సోదరుని యెడ మన ధర్మము...?

శైళ. (నిర్వేదపాటుతో)-

కర్తవ్యము? రాజు ఆజ్ఞను దాటుట నీతికాదేమో...! పిన్నలము; హేమంతుని అధికారమునకు లోబడిన అబలలము.

వసంతసేన —

అబలలము కాము. దివ్యభారత సీమలో జన్మించిన జాతికి ప్రభాకలితమైన ద్వితీయ పక్షము మనము. మనము లేనినాడు జాతి కుంటిది; అబల. మనజీవితపు వేడిరక్తము పొంగి పొరలు చుండగనే సోదరునకిట్టి అవమానము జరుగుట మన జీవితమునకు అపార్థము. శక్తి వంచన లేక దహన సంస్కార విధిని నెఱవేర్చుదము లెమ్ము.

నైళ- (వెలుగంది)

సోదరునియందు అపారమైన ప్రేమయు, అభిమానము ఉన్నవి; కాని రాజు నాజ్ఞను ఉల్లంఘించుట పాడికానేరదు. ఆజ్ఞను ఉల్లంఘించిన తటి రాజు మనలను అవమానపర్చును. ఇదివరకు జరిగిన దానికే చింతించుచుండ, అది మరింత వ్యసన కరమగును. నీ ఆవేశమునకు వ్యతిరేకముగా పలుకుచుంటినని ఆగ్రహింపకుము. రణస్థలిలో శవమును కాయుచున్న రాజసేవకులు మనలను మర్యాదతో చూడ జాలరు. మన్నించుము——

వసంతసేన.

పిరికిమందును పోయుచుంటివా ? అధర్మమును సహించుటకన్న చావు మేలు. నా సోదరునకు జరిగినది అధర్మము. దహన సంస్కారము జన్మహక్కు. బ్రతికియుండిన కాలములో జీవిత భేదములున్నవి. గతించిన పిమ్మట అట్టి జీవిత వ్యత్యాసములకు తావులేదు. ప్రకృతి సిద్ధమైన ధర్మము అది. తోడిమానవుని జన్మహక్కును అరికట్టుట పాలకునకు నిజధర్మము కాదు; అతని ఆజ్ఞ సన్యమైన ఆజ్ఞకాదు.

నైళ-

సోదరీ! ఎప్పటికైనను హేమంతుడు తన చర్యకు తగిన శిక్షను దేవునినుండి పొందగలడు. జీవరహిత మైన శవమునకు అవమానమును కూర్చుట జన్వాంతుని అవమానపర్చుట కాదని ఇంగితజ్ఞులు గ్రహించకలరు అది ప్రకృతి ధర్మమును జవదాటుటయు. అందులకు దేవుడు సహించడు.

వసంత సేన-

నైళా! నీసహాయ్య మవసరము లేదు. నేనొంటరి గనే నాసోదరునకు చేయగల కృషిని నెఱవేర్చెదను. నీ వేదాంతము నాహృదయ విదారకముగ నున్నది. దిక్కులేని మొక్కడి వోలె పురబాహ్యప్రదేశమున నాసోదరుని శవము శిథిలమగుచుండగా హాయిగా రాజాంతఃపురములో కాలము గడపగల చనటిసికాను. ఇంతకన్నను ఘనమైన కార్యమును నా జీవితములో చేయలేను.

నీవు చెప్పిన వాక్యములనే జీవిత సూక్తులగా అంగీకరించుచో జాతి అథఃపతనము చెందవలసినదే; జీవితములో వ్యక్తికి స్థానములేదు; వ్యక్తిత్వ రహిత మైన జీవితము పశుజీవితమును చూచి అసూయచెంద

వలసియున్నది. శవము కదాయని నిరసించ వీలులేదు. స్వధర్మ నిర్వహణము జీవితోత్తేజము. ఇది నాతుది నిశ్చయము.

నైళ-

అక్కా! నీ ప్రియత్నము భయానకముగ నున్నది. నా జీవితశక్తి సూర్య తేజము నెదుట దివ్వెవోలె నీ తీక్ష ప్రభావము నెదుట నలసారమైనది.

వసంతసేన

నాజీవితమును బలిదానము చేసియైనను నాసోద రునకు ఆత్మశాంతిని చేకూర్చక తప్పదు. జీవికి జీవికి ఇట్టి అవినాభావ సంబంధము లేనినాడు మానవజీవితము వ్యర్థము, దుర్భరము. ప్రపంచమే శూన్యగోళము.

నిష్క్రమింతురు.

[తెర తొలగరగా]



రెండవ రంగము.

[ఉదయం 10 గంటలు వేళ. రాజు పచారుచేయు చుండును. సేవకుడు ప్రవేశించి]

సేవకుడు—

మహాప్రభూ! శవకాపరి పులోమి

రాజు—

మంచిది. రమ్మను—

[భేజారుగా చూచుచు, ఆయాసమును బొందిన తనువుతో ప్రవేశించి పులోమి సాష్టాంగ దండ ప్రణామము లాచరించి]

పులోమి—

దేవరా! మహాతప్పిదము. మన్నింపుడు.

రాజు—

ప్రమాద మేమి? వివరించి తెలుపుము.

పులోమి—

(బెదరు చూపులతో)

అప్రమత్తులమై శవమును కనిపెట్టుచుంటిమి. గత అర్ధ రాత్రిమందు ఎవరో శవమును ఇసుకతో పూర్తిగా పూడ్చిపోయిరి. ఈఉదయము ఇసుకను తొలగించి, శవమును మామూలు ఉనికిలోనికి తెచ్చితిమి.

ఎప్పటి విషయములప్పుడు తమకు నివేదించవలయునను దేవర ఆజ్ఞానుసారముగా విన్నవించు కొనుచుంటిని. ప్రభువు ఆజ్ఞయున్నచో నీరాత్రి, ఆరాజద్రోహులను కనిపెట్టి శిరచ్ఛేదము చేయగలను.

రాజు- (శిరఃకంపమునొంది ఉగ్రుడై)

ఆజ్ఞను అతిక్రమించిరిగా! రాజద్రోహులు; వారా ప్రదేశమును సమీపించి, పునఃప్రయత్నము చేయుసమయము కనిపెట్టి నాదగ్గఱకు దీసికొని రమ్ము. లేసిచో నీప్రాణములవ్యాహతిము గావింపబడును. ఆద్రోహులను కూరముగా శిక్షింతును; ఇది నాప్రతిజ్ఞ.

రాజు నాజ్ఞను అతిక్రమించు ద్రోహులను మన్నించరాదు. వారిని చిత్రవధ చేయవలయును. పొమ్ము. ఫులోమి!

[ఫులోమి వెడలిపోవును. రాజు దీర్ఘముగా ఆలోచించుకొనుచు]

ఎవరో నా ఆజ్ఞను పరోక్షముగా సవాలు చేయుచున్నారు! భయంకర ఝుడివానకు ముందు చిటపట చినుకులు!! నేను రాజుధర్మమును అతిక్రమించితినా? లేదు —

[తెర]

[రాజనగరులో సోఫాపై కూర్చొని ప్రభాతకుమారుడు ప్రేమగాథ నొకదానిని చదువుచు చటుక్కున గ్రంథమును క్రిందికి జాఱవిడిచి తల పైకి ఎత్తి బొమముడితో.-]

పి ప్రభాతకుమారుడు.-

ఏమిది! విచిత్రముగా నున్నది!! ఎడమకన్ను అదురుచున్నది. గ్రంథములోని కథ రక్తికట్టి ప్రధాన కథా వస్తువైన పవిత్రప్రేమ ఫలీభూతము కానున్న సమయములో నిట్టి సంఘటన జరిగినది !!! శకున ఫలితము? తెలియరాదు !!! !

ఏమి! గ్రంథకారుని చాందసము. ప్రేమ అన్నిప్రశయములను దాటవలయునా ? ప్రేమ పవిత్రమైనది. దానినెవరును ఆటంక పరుపరాదు. గ్రంథము పెరుగుటకు చేసిన పని. చివరవఱకును ప్రేమ విజయము కాంచునను ఆసయే పొడసూపలేదు. అట్టి ఘోరవిపత్తుల నేల కల్పించవలయును? రసార్ద్ర హృదయులు గ్రంథమును చదువుచునే పవిత్రగాత్రయగు కథానాయికను ప్రేమించక తప్పదు. కథానాయకుడు మహాత్యాగి. ఇట్టివారు లోకములో---చాలా---తక్కువ.

[తెర, ఆలోచనగా]

[రాజు మంత్రులతో గొలువుదీరి యుండును.

సేవకుడు ప్రవేశించి]

మహారాజా! ఫులోమి......

రాజు- (అదరిపడి)

ప్రవేశపెట్టుము—

[ఫులోమి వసంతసేనను రాజునెదుటకు దీసికొనివచ్చి, దండమాచరించి, మాటలేక నిలబడును]

[మంత్రులలో గుసగుసలు]

రాజు [ఆశ్చర్యముతో]

ఫులోమి! నేరస్థురాలీపెయేనా?

ఫులోమి—

మహారాజా! మనవి. మరల అర్ధరాత్రివేళవచ్చి శవముపైని ఇసుకను జచ్చిపోయుచున్న దీమె. జాగరూకులమైయున్న మేము పట్టుకొంటిమి. ఇంతకు ముందు చేసినదియు తానేనని మహారాజు పుత్రికఒప్పుకొనుచున్నది. దేవరచిత్తం.

రాజు- (మంత్రులవంక వక్రంగా)

ప్రధానమంత్రి జయశీలుడు—

ఫులోమి! వెడలిపొమ్ము నీపని చూచికొనుము.

రాకుమారీ! పులోమి నిన్నిచటకు దీసికొనివచ్చిన కారణము గ్రహించితివా?

వసంత సేన—

సోదరుని శవముపై పుడిసెడు ఇసుక రేణువులను విసరి నందులకు—

జయశీలుడు—

అట్లుచేయరాదని మహారాజు ఆజ్ఞ.

వసంత సేన—

అర్థములేని ఆజ్ఞలకు బద్ధులుకాలేరు. అది ఆజ్ఞ కాదు. దాక్షిణ్యదూరమైన నిరంకుశత్వము. నా సోదరుడు మీ మహారాజు నామునకు చేసిన అపకారమేమి? నిర్వహించుకోలేని అధికారము...! రాజ్యాధిపత్యము హా———! సోదరా...!!

రాజు— (దద్దరిలి)

ద్రోహి! ద్రోహి!! ద్రోహి!!!

వసంత సేన—

నేను ద్రోహినికాను. మానవుని జన్మహక్కును, ప్రకృతిసిద్ధమగు విధియును, దేవదత్తమైన జీవిత స్వత్వమును అగు దహనసంస్కారమును అరికట్టిన రాజు ప్రజలయెదుటను, దేవుని యెదుటను ద్రోహి.

రాజు- [ఉగ్రుడై]

అర్ధరాత్రియందు గూఢముగా శవమును పూడ్చుటచేయరాని నేరము. రాజవంశమునకు కళంకము.

వసంతసేన-

నీకుగాని, నీ ఆజ్ఞకుగాని భయపడి పరివర్తించిన విధానముకాదు. నేను గౌరవముగల వంశమునకు చెందిన పడుచును. సేవకులు నీ ఆజ్ఞాను బద్ధులై మొఱటుతనముగా పరివర్తింతురను శంకచే అట్లుచేసితిని.

రాజు- [పండ్లునూరుచు]

నా పాలితరాజ్య భాగములో విమూఢులగు స్త్రీలు ఇట్లు రాజునాజ్ఞను అతిక్రమించి పరివర్తించిన నేను సహించను. నీవిక ప్రాణములతో జీవింపనేరవు.

వసంతసేన-

నాకు మానవహృదయమున్నది. జస్వంతుని యెడ నీపరివర్తన భరింపరానిది. నా ప్రాణములను గణనచేయను. స్త్రీలు విమూఢులుకారు. నీస్థితిని బట్టి ఇతరులను కూడా ఆవిధముగానే తలతువు. చల్లని ఉదకములో భయంకరమగు అగ్నిపుట్టురీతి ప్రేమకు స్థాయీభావము నొనగూర్చు నాహృదయమందు పరిశయ

మునుబోలు అగ్ని పర్వతమొకటి బ్రద్దలగుచున్నది.

అధర్మమును సహించలేక పోవుటయే ఇందుకు వ్యాజము. నేను చేసినది ద్రోహముకాదు; నేరము కాదు.

రాజు- [తీవ్ర నేత్రుడై - మంత్రులను తిలకించి]

రాజు నాజ్ఞను అతిక్రమించుట; రాజుముందట తిర స్కారభావమును ప్రదర్శించుట! క్రూరశిక్షకు పాత్ర ము. నాఆజ్ఞకు మారులేదు. తూ చా లు తప్పకుండా అవులు జరుగవలయును. మందమతులగు స్త్రీలు ఇట్టి వ్యక్తిత్వమును ప్రదర్శింప వీలులేదు.

వసంత సేన—

ఎన్ని రక్తపుచుక్కలు చిందింపబడునో అంత అధః పతనమును చెందకమానదు ఈరాజ్యము. నాచావే ఈరాజ్యమునకు శాపము; నాచావే సోదరుని ఆత్మ కుశాంతి.___

రాజు- [మంత్రివంక - కంపించు బొమముడితో]

జయశీలుడు-

భటులారా! రాకుమార్తెను తీసికొనిపోయి ఖైదు లోనుంచుడు.

నిష్క్రమింతురు.

[తెర తొలగరా]

## మూడవ రంగము

[ఆలోచనా మందిరము. రాజు జయశీలుడు సంభాషించుచుందురు. ద్వారపాలకుడు ప్రవేశించి]

ప్రభువులు, ప్రభాతకుమారరాణా ...............

రాజు.- [ఆలోచనాపరుడై]

ఆజ్ఞ———————

[ప్రభాతకుమారుడు ప్రవేశించి తండ్రికి వినయపూర్వకవందనమాచరించి ఉచితాసనమును అలంకరించును.]

ప్రభాతకుమారుడు.- [ద్వారపాలకుని వైపునకు]

మంత్రి.- ద్వారపాలకుని ఉద్దేశించి]

వెడలిపొమ్ము.

ప్రభాతకుమారుడు.-

పనిపడి తండ్రిని, మంత్రివరేణ్యుని దర్శించుచుంటిని.

రాజు.- [సందేహముతో]

ప్రభాతరాణా! నీసలహాలను మేము ఎప్పుడు స్వీకరించుచుందుము. నీఆలోచనలు మాకు గణనీయములు.

ప్రభాతకుమారుడు.-

తండ్రీ ! ఛత్రమును ధరించువానికి అందలి కష్ట

ములు తెలిసినట్లే రాజ్యభారము వహించు వీరికి అందలి కష్టనిష్ఠురములు విశదము. స్వీయప్రజలకును, రాజ్యమునకును అభ్యుదయమును చేకూర్చునట్టివి రాజు నాజ్ఞలు.

రాజు- [ఆతురతతో తల పైకెత్తుచు]

జస్వంతుడు మనకు చేసిన అపకారము న్యాయ్యము. ఆవిధముగా జస్వంతుని శవమును శాసించుట తనకు మరి............

రాజు- (క్రుద్ధుడై-)

శత్రుమహీపతుల అండచేరి నిజరాజ్యమును ధ్వంసమొనరించ తలపెట్టిన రాజద్రోహి. రాజ్యమును అల్లకల్లోలము చేసెను. ప్రజలకు శాంతిలేదు అట్టి దుష్టుని ప______ రీ— ——తి—— ——

ప్రభాకరకుమారుడు-

జస్వంతుడు మరణించిన ముహూర్తముననే ప్రజల హృదయములలో ఉశికి పైకి ఎగురుచున్న కోపాగ్ని భగ్గున చల్లారిపోయినది. అపారమైన సానుభూతినే ప్రజలు నేడు వెలిబుచ్చుచున్నారు. ప్రస్తుతము మీ ఆజ్ఞయే వారి ఆత్మలలో శాంతిని సళంపజేసినది. క్షమించుడు-

రాజు- [తలపంకించి-

రాజద్రోహిని పక్షమువహించి మాట్లాడుచుంటివిగా !......!! .....ఊ...!!!

ప్రభాతకుమారుడు-

రాజద్రోహుల పక్షమవలంబించుట నామతము కాదు. ప్రపంచములో చావు చాలగొప్పది. దానిని మించిన దివ్యవస్తువులేదు. చనిపోయినపిమ్మట సమాన సంస్కారమును బొందుట జన్మతో ప్రసాదింపబడిన ఆటంక పరుపరానిహక్కు. అట్టిహక్కును అరికట్టుట లోకమునకు అధర్మమును బోధించుట; అదిమానవ హృదయ జనితమైన భావశబలతకు అహంకార పూరితమైన అధర్మసవాలు; భయంకరమైన నిరంకుశతువాను

రాజు- [అరుణనేత్రుడై]

జయశీలుడా...! ఏమి...? ఈవింతసంభాషణ...!!

ప్రభాతకుమారుడు-

మీఆజ్ఞను అతిక్రమించిన వసంతసేనను మన్నించుము. మీఆజ్ఞలను అతిక్రమించుట ఆపె తలంపుకాదు. సోదరునియందలి గాఢానురాగమే అందులకు కారణము. అదిహృదయ ప్రబోధితమైన ధర్మము. ఆపెపవిత్రగాత్రి.

శుష్కానలమునకు అనలమెటులో ఆధర్మమునకు వసం
తసేన అట్లు.

రాజు- [మంత్రిని తిలకించి]

రాజు నాజ్ఞ అంతఃపురములోనే మన్నింపబడనిచో
ప్రజలెటుల.........?

[కొడుకును చూచి] రాజ్యద్రోహుల నేరస్థుల తర
పున మాట్లాడుటకు సాహసించుచుంటివి...!!

నాఆజ్ఞలను మార్పింపగలారు ఇంతవరకు పుట్టలేదు.
కఠినశిక్షను స్వీకరించి వసంతసేన చావక తప్పదు.
వైద్యుడు శస్త్రచికిత్సచేసి దుర్మాంసమును తొలగిం
చురీతిని నాప్రజలలో నిండి ఆజ్ఞోల్లంఘన భావములను
రూపుమాపుట నావిధి. ఇది నానిశ్చయము.

ప్రభాతకుమారుడు- (సవినయముగా)

తండ్రీ! మన్నింపుడు. పట్టుదల రాజనీతి కాదు.
విషయ పర్యాలోచన సమంజసమైనది.

రాజు- [పట్టుదలతో]

అబల ! కార్యవిమూఢ !! శాసన తిరస్కారము
చేయుచో——నేను సహించగలనా ? ప్రజలఎదుట
నన్నవమానపర్చుటకు...ఛీ. దుష్ట, దుశ్చరిత——

నిశితశిక్షకు గురిచేసి నావప్రితానమును ప్రదర్శింపవల
సినదే——

ప్రభాతకుమారుడు-

[విసుగుచెందిన తనువుతో లేచి నిలబడి]

వసంతసేనకు చావు!- !! ,[ప్రక్కకు తలత్రిప్పి, తీక్ష
దృష్టితో] ఇప్పటికి జరిగినది అర్ధవిషాదాంత వృత్త
ము !!! ఈతనువులో ప్రాణమున్నంతవరకు......!!!!
[వెడలిపోవును]

జయశీలుడు-

మహారాజా! ప్రభాతరాణా కోపమును చెందినాడు
ప్రతిజ్ఞకూడా----

వసంతసేన రాకుమారియందలి ప్రేమయే ఇందుకు
దోహదము.

తమరు మన్నించుటకు ప్రయత్నించుచో-----

రాజు- [బొమముడితో]

ఇట్టిదుష్టులను మన్నించుటకు వలనుపడదు. రాజు
గౌరవమును, రాజ్యగౌరవమును కాపాడక తప్పదు.
శిరస్సున కిరీటములేని హేమంతుడు మన్నించును-

[నిష్క్రమణ

[అవనిక జారును.]

## నాలుగవ రంగము

[వసంతసేనను రహోమార్గమునందుంచి శిక్షించ రాజునాజ్ఞ. రాజవీధుల నడిపించుకొని భటులు వసంతసేనను తీసికొని పోవుచుందురు.]

[ప్రజలు గుమికూడుదురు—]

ప్రజలు-

వజ్రములోని నీటిబిందువులవలె ఆమె లావణ్యము కంపమును చెందుచున్నది. శాసించు హస్తములు శాసింపబడినవి ! పాపము !! ఎంతటివిపత్తు !!! (నెమ్మదిగా) హేమంతుని హృదయము కర్కశమైనది; దయారహితమైనది. పేరు ప్రతిష్ఠలు గణించిన రాజవంశమున కెట్టి దుస్థితి! (కొంగులతో కనుల తుడుచుకొనుచు- ఎలుగెత్తి) రాకుమారీ! అయ్యో !!...... హా......!!!

వసంతసేన- [గద్గదికముతో]

విచారపడకుడు. ధర్మమని తోచినపుడు సత్యమైన దానిని విడువక ఆచరించుట జీవితాశయము. అప్పుడుజీవితము విజ్ఞాన సౌధసీమల కెగబ్రాకుచున్నది. నేను చనిపోయినను హేమంతుని ప్రభ వర్ధిల్ల నేరదు.

హేమంతుడు నన్ను చంపగలడు గాని నాఆచరణ పూర్వకమైన పూజ్యభావమును నశింపజేయలేడు. కార్యమునకు భావము పితామహుడు వంటిది. సృష్టి కర్త కూడ దానిని నిరోధింపలేడు. ముందుదానిని మీారే చవిచూతురు.

[నిష్క్రమణ-

తెరతొలంగరగా]



[ప్రభాతకుమారుడు తన గదియందు దీర్ఘాలోచనాపరుడై వసంతసేనయొక్క చిత్రపటమును తిలకించుచుండును. సవినయముగా సేవకుడు ప్రవేశించి]

సేవకుడు—

మంత్రివరేణ్యులు......దర్శనార్థము——

ప్రభాతకుమారుడు-

ప్రవేశపెట్టుము.

జయశీలుడు—

[ప్రవేశించి, ఉచితాసనమును అధిష్ఠించి, రాకుమారుని అవలోకించి-]

యువరాజులుం గారికి క్షేమము?

ప్రభాతకుమారుడు-

ధర్మసహిష్ణులు క్షేమమనిన గణనకాదేమో!
మీ మహారాజులు, మీరును క్షేమమా?

జయశీలుడు (పండ్లతో పెదవులనదిమి)

క్షేమము. ప్రభాతకుమారులకు సర్వము విశదము.

ప్రభాతకుమారుడు-

సృష్టికర్త మందమతి. విపరీతమానసిక ప్రవృత్తుల సృజింప అతనికి కేళి. దారుణసంఘటనలకు అవి

పునాది. (సవిధానముగా) అదినేరము కాదు. నేరమైనను వసంతసేన కట్టిమరణశిక్ష! ఆనేరము ఆశిక్షకు తగినదా?

జయశీలుడు-

అది ప్రభువు ఆ .

ప్రభాతకుమారుడు-

మంత్రిజీ! వేయిచెప్పుము. వసంతసేన చేసినది నేరముకాదు. రాజు ఆజ్ఞ అధర్మము. మీబోటి రాజ్యాంగవేత్తలుండియు మిన్నకుండుట విధ్యుక్తధర్మమును వ్యభిచరింపజేయుట.

[ప్రక్కకు తిరిగి] ఏమానవవ్యక్తికి అన్యాయము జరిగినను నాహృదయము భరించదు; అది వసంతయెడమరింత.

జయశీలుడు-[ ఆగి, ఆగి మాట్లాడుచు]

అదేల? రాజకుమారి అనియా?

[రాజకుమారుని ముఖవిలక్షణముల కనిపెడుతూ]

అట్టి భావములు మీకుండవు. మరేమో?

ప్రభాతకుమారుడు- [చకితుడై]

సూటిగా మాట్లాడుట నాస్వభావము. వసంతసేనను ప్రేమించితిని. (మంత్రి ముఖమును అవలోకించి)

అది పవిత్రప్రేమ. మాది క్రొత్తదికాదు. ఇట్టి దివ్యగాథలు ఎన్నో పూర్వము కాలవాహినిలో తేలిపోయినవి.

[చేతిలో గడ్డముంచుకొని, మంత్రి వైపునకువంగి]

ప్రేమయొక్క శక్తిని అర్థము చేసికొనుట సులభమైన పనికాదు. హృదయమున్నవారికి తెలియగలదు. లాంటివారికి ప్రేమ గొప్పదనిన నావాక్కులు పిచ్చివాని కొసవెఱ్ఱి తలపులు. అయినను మీదగ్గఱ ఇంతగా చెప్పుట మీహృదయము కవి హృదయమని; మీరు కవులని.

నాహృదయమును లాగివైచినది వసంతసేన, నేను నావశములో లేను.

[నిటారుగా కూర్చుని] వసంతసేనను క్రూరముగా అంతమొందించుట మీమహారాజుల యొక్కయు, మీయొక్కయు పరమావధి !...సరి...... !!

మీరు ఒక్కతనువును ఖూనీ చేయుటతో రెండు జీవములను హత్యచేయుచున్నారు.

జయశీలుడు-

పాపము శమించుగాత.

రాజకుమారి ప్రాణములు మీచేతులలో నున్నవి. మీరు రక్షింపగలరు, శిక్షింపగలరు -

ప్రభాతకుమారుడు- [బొమముడితో శంకించుచు]

నేనెంత హృదయ పూర్వకమైన అమాయికతను వెల్లడించినను, మీరింకను తంత్రాంగ వేత్తగనే మాట్లాడుచున్నారు. ఇది శోచనీయము—

పాపము శమింపదు. ఇదిశమించు అల్పఅగ్ని కణము కాదు. ఇక మంత్రులు మాట్లాడుతారు కాబోలు.

జయశీలుడు-

మొదట సామాన్యమైనను తరువాత ఇది క్లిష్టసమస్యయైనది. దీనినిగూర్చి తొలుతనుండియు ఆలోచించుచునే ఉంటిని.

వసంతసేన రాకుమారి యెడ మీకుద్ధాను రాగముసకు విడాకులు......అప్పుడు గడువుతో కూడిన సామాన్యశిక్ష రాకుమారికి... గతించ నవసరముండదు. మరి ..మీ———

ప్రభాతకుమారుడు- [గభాలున సోఫానుండి లేచి వసంతసేన చిత్రపటమును తదేకదృష్టితో చూచుచు]

తనువుల కిపుడే ఎడబాటు. ప్రేమభావమునకు ఎడబాటు కల్పించ ఎవరికి వశము !! (మంత్రివైపుకు తిరిగి) మీరాజు పేర్కొన్నవి మూడు దురంతములు. మొదట ఆజ్ఞ, రెండు శిక్ష, మూడు మాపవిత్ర ప్రేమకు

చెల్లు చీటులు !!! చెల్లు చీటులు !!!!

ప్రేమకు చెల్లుచీటులు కల్పించ నావశముకాదు. వసంత సేనను రక్షించుటకు నాప్రేమ అడ్డము వచ్చినదా? (మంత్రిని సమీపించి చేయిపట్టుకొని, మంత్రియు నిలబడును.) ఇదిగో నాహృదయమును విప్పిచూడుము. ప్రేమకు నిలయమై, కరుణకు పాత్రమై, ఒప్పుచల్లని హృదయములో, అన్యాయమును, అధర్మమును సహించలేని అగ్నికణములు పొంగి పైకెగరుచున్నవి; అభవుని త్రినేత్రాగ్ని మన్మథుని అశరీరునిగా చేసినటుల——

అప్పుడే సగము నన్ను మాడ్చివైచినవి; తక్కిన సగము కొలదికాలములో రూపరహితమై, నా ప్రేమ భావమే అశరీరియై భరింపరాని ప్రళయమును కల్పించక మానదు.

[వేరు వేరుగా నిలబడి] నా ప్రేమ వసంతసేన ప్రాణములకు శత్రువా?...హా... !! హా... !!! హా!!!!

జయశీలుడు-

మీబోటి రాజకుమారులు రాజ్యద్రోహియు, నేరస్థురాలైన వసంతసేనను ప్రేమించుట తగదని మహారాజుల తలంపు.

వసంతసేన రాకుమారి పక్షమున మీరు వారి సమక్షమున మాట్లాడిన పిదప ఇట్టి భావమును మహారాజులు నాకు విశదపర్చిరి.

ప్రభాతకుమారుడు- [మోమును సంకుచిత పరచి]

వసంతసేన నేరస్థురాలుకాదు. నా ప్రేమ విడువతగినదికాదు. మహారాజు చెప్పిన సాకుసవ్యమైనదికాదు. నాపాలిత రాజ్యభాగములో రాకుమారుడు, నేరస్థుడు అను విభాగములు లేవు. రెండు మానవహృదయములు ప్రేమైకరతిలో మునిగియున్న కోటి నేరస్థుడు, రాకుమారుడు అను వ్యత్యాసము శూన్యము.

మహారాజు సముక్షమున చేసిన నాప్రతిజ్ఞను జ్ఞాపకము చేయుడు మరల.

(తెర)



## అయిదవ రంగము

[హేమంతుడు, యజశీలుడు ఆలోచనా మందిర
ములో కూర్చొని,]

రాజు—

సరే! సామాన్యవిషయము విషమసంఘటన అయి
నది. వసంతసేనను పీడడు! తండ్రిమాటను సరకుగొన
ని కొడుకు రాజు నాజ్ఞను తిరస్కరించిన అన్యాక్తపు
పిల్లకు పెండ్లికొడుకు !!! ఊం... !!! అంత అమాయి
కతను వెల్లడించినాడా?

జయశీలుడు-

రాకుమారుని హృది తంత్రులనుండి ప్రేమ రసవా
హిని వెల్లివిరిసినది. ఆమధురమూర్తి అల్లకల్లోలమును
చెందుచున్నాడు.

"రాజుది అధర్మము; వసంతసేనది నేరము కాదు;
నేను వసంతసేనను పీడజాలను" ఇది అతని ప్రతివాక్యు.

"రాజు నాజ్ఞను జవదాటరాదు; వసంతసేన నేరము
చేసినది; తండ్రిమాటను కొడుకు మన్నింపవలెను."
ఇది మీాపట్టు. ఈసమస్యను నేను తీర్చజాలను. బుద్ధికీ,
హృదయమునకు ప్రతిష్టంభన మేర్పడుచున్నది.

నాలో నిబిడీకృతమైన రాజ్య తంత్రాంగ వేత్త మేద
డునకును, కవిహృదయమునకును పోటీ కల్పించినాడు
ప్రభాతకుమారుడు. వీని సంఘర్షణ ప్రళయకాల సన్ని
భము; కులగిరులదారుణ యుద్ధము.

ఆతని ప్రేమవాహిని గట్లనొరసియైన ప్రవహిం
చును; గట్లను దాటియైన ప్రవహించును; కాని ఎడా
రిభూములలో నింకిపోదు. నేనుతీర్చలేను. మాచిత్రము.

రాజు. [నిశ్చయముతో]

తండ్రి ఆజ్ఞను అధర్మముగా చాటిన పుత్రుడు లేక
పోయిన చింత లేదు. (ప్రతిజ్ఞాపూర్వకముగా) పోనిమ్ము.
రాజవంశమునకు కొదువరాదు.

నా ఆజ్ఞలు మన్నింప బడవలసినదే.

జయశీలుడు.

చిత్రము—రాజునాజ్ఞ———!!

[అవనిక జారును.]



[రాజాంతఃపురము సోఫాకు చెంత యొకవైపున కూర్చొని హేమంతుడు, రాగిణీదేవి-]

రాజు- [పెడమొగము చేసి]

ఇప్పుడు నేనేదియు చెప్పజాలను. నీవు చెప్పినది సర్వము నాకు విశదము. (రాణివైపునకు తిరిగి) అధికారము మాజీవితమునకు అంకితము!

రాగిణీదేవి- [ప్రార్థనాపూర్వకముగా]

పట్టుదల వీడుడు. పరిస్థితులు విషమించినవి. మీకు నేను చెప్పజాలను. —...మరి ప్రభాతకుమారుడు-

రాజు- [తిరస్కారభావముతో]

కుమారుడు కాడు కడుపునగన్న బడబానలము. నా అధికారమును తిరస్కరించిన తుంటరి. రాజద్రోహుల పక్షమువలంబించు చెనటి.

రాగిణీదేవి- [అశ్రుపూరితనేత్రి- సవిచారముగా]

అయ్యో! ఎంతటి దుర్ఘటన సంభవించినది!! (ప్రాణప్రియుని చేయిపట్టుకొని) క్షమించుడు. మన్నించుట అధికారముయొక్క పూజ్యస్వభావము. (నిశ్చేరపాటున భర్త మొగమును చూచుచుండును)

[తెర, నెమ్మదిగా]

## ఆఱవ రంగము.

[రహోమార్గమున వసంతసేన: శుష్కించిన శరీరము, విరక్తిభావముతో కూర్చొని]

వసంతసేన- [అశ్రుపూరిత నేత్రములతో]

ఆహారములేదు. లేకపోయిన నేమి? నావ్రతము నాకాహారము. హంసతూలికా తల్పముల సుఖనిద్ర చెందు తనువు కర్కశపాషాణ తలములపై శయనించుచున్నది! రణస్థలిలో జస్వంతుడు అంతే. అతనికి ప్రాణము లేదు. నాకు ప్రాణమున్నది. భరింపరాని స్థితి నాది. శతకోటి శత్రువులనైన ఒక్కతటి విదళించగల కరవాలమును ధరించి రణభూమిలో పడియున్న నాసోదరుడు, నిశియందు సమాధి స్థితిలోనున్న పట్టణమును ఈక్షించుచున్నాడు !!

ఈజీవముల భరింపలేను. జస్వంతుని కలిసికొనక తప్పదు. అప్పుడు నాఆత్మకు శాంతి. యజ్ఞ సంపూర్తి.

[అరచేయి చూచికొని]చేతిలో చేయివైచి బాస చేసినాడు ప్రభాతకుమారుడు. ప్రియుడా! నాహృదయమునీది, తనువు నాది. మనది కళంకరహితమైన ప్రేమ. రెండుహృదయములు, రెండు కెరటాలు ఎగిరిపోయి

నవి; ప్రేమైకరతిలో గుడుగుడు గుంచము లాడుచున్నవి.

నా ప్రేమను ఈరహోమార్గ ద్వారములు బంధించ లేవు. భూమి ఆకాశములే నా ప్రేమను అరికట్టజాలవు.

హా! మధురమూర్తి !! ప్రభాతకుమార !!! నేనిక జీవింపజాలను. ఒక్కమారు నీమోమును చూడ నిమ్ము. దుఃఖమును మరచి, ఆనందముతో మృత్యు వును స్వీకరింతును. నన్ను మరచితివా ?

ప్రభాతా ! ప్రభాతా ! [రహోమార్గము ప్రతి ధ్వనించును] పాషాణములు స్వీయజీవితమును ధన్యత చెంద చేసికొనుటకు ప్రభాతుని నామమును ఉచ్ఛ రించుచున్నవి !! హా......!!! ప్రభాతా !!!

[ధైర్యముతో నిలబడి-దోసిలొగ్గి- పైకిచూచుచు]

మహాప్రభూ ! దేవా !! ఈజీవితము దుర్భరము. మాబోటివారిని ఉద్ధరించగల దివ్యవరము చావు. దానిని ప్రసాదింపుము.

మృత్యుదేవతా! పుణ్యముగట్టుకొనుము. ఇట్టివారిని రక్షించగల ఘనదేవతవు నీవే ! [పర్యాలోచించి] జీవితమా! నీముగింపు ఒకవిషాదమునకుభరతవాక్యము. అయ్యో! ప్రభాతా !! నీజీవిత విషాదమునకు నాంది.

[కొంగును చేతితో పట్టుకొని,] నీవు ధన్యవు. నీఉపకారము జన్మ జన్మాలకు మరువ తగినది కాదు. ఇంతవరకు నాకు శృంగారము చేకూర్చితివి. ఇపుడు నన్ను యమబాధనుండి రక్షించుచుంటివి.

నాచావు ఈరాజవంశమునకు కాదు ఈరాజ్యమునకు అపరిమితి హాతమైన శాపము.

జస్వంతా! ఇదిగో నాజీవితము నీకు అర్పితము. పరిభాతా! మన్నింపుము. నేను చచ్చినను మనప్రేమ చావదు. దానికి చావులేదు. అది ఒక్కటియే లోకములో శాశ్వతమైనది.

[కొంగుతో కంఠమును బంధించుకొని నేల బడును]

[తెరతొందరగా]



[ప్రభాతకుమారుడు భేజారుగ రహస్యమార్గమును సమీపించి]

ప్రభాతకుమారుడు-

వసు ! వసు !! పలుకుటలేదు. (లోపలకు తొంగి చూచి) అంధకార బంధురము. ఈనిబిడాంధ కార ములో నెట్లు జీవించుట.

వసు! వసు!! (వసంతసేన మూల్గును) (లోనికిజని, తలుపులు తెరచి) హా! వసు !! హా! వసు !! (ప్రభాత కుమారుడు కూర్చొని, కంఠబంధమును విప్పబోవును రెండుహస్తములను ప్రభాతకుమారుని కంఠమునకు పెనవైచి, కనులు నీరుగారుచుండ, వసంతసేన ప్రాణ ముల విడుచును) హా! హాతవిధీ !! విషాదము ! విషా దము!! (మూర్ఛపోవును)

[నిద్రానించి లేచి] వసులేని నాజీవితము వ్యర్థము; దుర్భరము. ఇంతకుముందు నాహృదయమును హరిం చిన వసు నేడు నాప్రాణములను హరించును. అది నా కుమోక్షము. మహారాజా! ఆచంద్ర తారార్కము గా వర్ధిల్లుము!

ధర్మముకొఱకు వసంతసేన తన జీవితమును బలి దానము చేసినది. వసంతలేపిన విప్లవము ఈనాటితో పోవునది కాదు. మహాపవిత్రమైనది. యుగ యుగముల నతిక్రమించి ప్రళయమును ప్రజ్వరిల్ల జేయును.

ధర్మమును ప్రేమించి, సహజమానవ హృది తంత్రిల స్మృతిని మేళవించి, దివ్యగాథను గానముచేసి, దివమలంకరించిన వసంతసేన హృదయమును సస్నేహముగా ప్రేమించిన ఈప్రభాతుడు, ఈవియోగి, ఈ దురదృష్టుడు, జీవింపలేడు. [కత్తి దూసి పొడుచుకొనును.]

[అవనిక జారును]



ఏడవ రంగము.

[ఆలోచనా మందిరములో రాజు ఒంటరిగా: సేవకుడు ప్రవేశించి]

సేవకుడు—

మహాప్రభూ! ప్రమాదము. వసంతసేనయు, ప్రభాతకుమారుడును ఆత్మహత్యలు చేసికొనిరి.

రాజు- (గభాలున లేచి)

ఏమి...? ఏమి...? ఏమి...?

[ఇంకొక సేవకుడు ప్రవేశించి]

సేవకుడు-

మహారాజా! ప్రళయము. ప్రభాతకుమారుని మరణమును విని రాగిణీదేవి అట్లె ప్రాణములు వదలినది.

రాజు- [చతికిలబడి]

హా! హా!! హా!!!

[మరియొక సేవకుడు ప్రవేశించి]

సేవకుడు.

ప్రభూ! వసంతసేన ఆత్మహత్య గావించుకొనిన సంగతి విని నైశికస్య పిచ్చియెత్తి రాజవీధుల హా రని ఏడ్చుచు పోవుచున్నది.

రాజు- [నేలపై బడి]

ఒక్కకత్తి; ఒక్కకత్తి; నన్ను విషాదజ్వాలలనుండి రక్షించుటకు ఒక్కకత్తి.

[స్పృహ తప్పిపడిపోవును. సేవకులు లోనికి మోసికొని పోవుదురు.]

[అవనిక తొందరగా]

సంపూర్ణము.



| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 111 | 9 | కానేరరు | కానేరదు |
| 7 | 7 | దయార్ద | దయార్ద్ర |
| 7 | 12 | మూర్చ | మూర్ఛ |
| 7 | 15 | పటిపత | పటిష్ఠత |
| 8 | 19 | పర్చు | పరచు |
| 9 | 13 | కలితము నైన | కలితమైన |
| 10 | 1 | వెలుగంది | వెలుగండి |
| 10 | 5 | పర్చు | పరచు |
| 12 | 7 | తీక్ష | తీక్షణ |
| 13 | 2 | గంటలు | గంటల |
| 14 | 9 | పాణముల | ప్రాణముల |
| 14 | 18 | రాజు | రాజ |
| 17 | 9 | రాజునాము | రాజనాము |
| 21 | 3 | అభ్యుద | ఉభ్యుద |
| 21 | 5 | రాజు- [ఆతుర...] | [రాజు- ఆతుర...] |
| 22 | 2 | ద్రోహిని | ద్రోహి |
| 23 | 1 | ఆధర్మ | అధర్మ |
| 23 | 6 | రాజ్య | రాజ |
| 24 | 5 | తీక్ష | తీక్ష్ణ |
| 24 | 16 | రాజు | రాజ |
| 26 | 3 | పితామహుడు | పితామహుని |
| 28 | 4 | ఆ | ఆజ్ఞ |
| 33 | 2 | యజ | జయ |
|  | 11 | కనులు | కనుల |

# రానున్న నాటికలు.

(1) జపిత- శీల సౌందర్యముల సంఘర్షణ:

Is beauty skin deep or character deep?

60 పేజీలు.

(2) నిరీక్షణ- ప్రేమ, కామముల ప్రబల సంఘర్షణ:

A tragic collision between pure love and lust 70 పేజీలు.

(3) దేవికారాణి- ఆదర్శ విచ్ఛిత్తి:

A tragidy in the womb for an idealistic life of beauty. 80 పేజీలు-

ఈమూడు నాటికలు మూడులోకముల నేలగలవు. హృదయమున్న వారికి విషాద ప్రళయజ్వాలా శివతాండవమును, వేడిరక్తమున్నవారికి జీవిత జ్యోతిరోత్సుకతను, కన్నీరు కలవారికి హృదయోద్భేదక ఉల్కాపాత సమన్విత శోకతమమును కల్పించగలవు.

చాపరాల

